# పాము — కొంగ — ముంగిస

ఒక యడవిలో ఒకచెట్టుమీద ఒకకొంగ గూడుకట్టుకొని గుడ్లనుపెట్టుచుండెను. ఆచెట్టుమొదటనున్న పుట్టలో నివశించుచున్న పాము కొంగమేతకు పోజూచి దానిగుడ్లను తినివేయుచుండెను. పాము తనకుజేయుచున్న అపకారమును కొంగ తెలుసుకొనెను. గాని పామును ఏమియునుచేయలేక తన స్నేహితుడగు నొకకాకితో చెప్పి ఏడ్చెను. కాకి దానినోదార్చి ఈసమీపమున ఒకపొదలో ఒకముంగిసగలదు. దానికిని నాకును చాలస్నేహము. మనమిద్దరమును దానికడకుపోయి దానిని భోజనమునకు పిలుతము. దానికి చేపలన్న మిక్కిలి ఇష్టము. కావున నీవు కొన్నిచేపలను తెచ్చి ముక్కలుచేశి దారిపొడగునను వేయుము. మఱికొన్నిటిని నీగూటియొద్దనుంచుము. వానిని తిని మరలిపోవునపుడు మనము దానికి ఆపుట్టనుజూపించితిమా? అది యాపామును తప్పకచంపును. నీకీబాధతీరునని కాకిచెప్పెను. కాకియును కొంగయును గలసి ముంగినకడకు పోయినవి. ముంగిస కాకినిజూచి ఏమోయీ కాకిబావా? చాలకాలమునకు కనపడినావు ఇతడెవరని అడిగెను. ఇతడు నాస్నేహితుడు మిక్కిలిమంచివాడు: మనము ముగ్గురము స్నేహముగానుండవలెనని తీసుకువచ్చితిని. అనికాకిచెప్పెను. నాకును సంతోషమే అని ముంగిస అనెను. వారుముగ్గురు కొంతసేపు కలసియుండిరి. మీరిద్దరును యీసాయంత్రము నాయింటికి భోజనమునకు రావలెను. నేను మరలవచ్చి మిమ్ములను తీసుకొని

పోయెదనని కొంగ చెప్పెను. ముంగిస సరే అనెను. కొంగయు కాకియు వెళ్లిపోయెను. కొంగ కాకి చెప్పినట్లు ఏ నేటికోలోయి కొన్ని చేపలను తెచ్చి కాకి చెప్పినట్లు చేసెను. కొంగయు కాకియు కలసి మరల ముంగిసకడకు వచ్చెను. ముంగిస దానిలోనున్న చేపముక్కలను తినుచు వానితో కూడ పోయెను. అనిసుమాను చెట్టుపైకెక్కి గూటిలోనున్న చేపలను తిని దిగవచ్చినప్పుడు కొంగయు కాకియు ముంగిసకాపురమును చూపించెను. ముంగిస వానినిబొమ్మరిని తాగాపుట్టచెంత నక్కియుండి పాము వెలుపలరాగానే దానిని పట్టుకొని ముక్కలుక్రిందమీదికి చంపివేసెను.

నీతి—పరులను జెరుపఁగోరువారు తామే చెడుదురు.

# కాకి కొంగల ప్రసంగము.

## మొదటి రంగము.

కాకి—ఏమోయి కొంగబావా? విచారముగానున్నావు.

కొంగ—కాకిబావా? నేనేమి చెప్పుదును. నేను కాపురమున్న చెట్టు మొదటనున్న పుట్టలోనుండి ఒక త్రాచుపాము చేరి నేను పెట్టిన గుడ్లనన్నిటిని తనపాలను పెట్టుకొనుచున్నది. నాకు దానిబాధ తప్ప దారి ఏమియు తోచక దిగులుపడుచున్నాను.

కాకి—అయ్యో ఎట్టి కష్టమే వచ్చినదే? అయినను నాకొక్కయుపాయము తోచుచున్నది. వినుము నాకు జతకాడుగు ముంగిస ఈసమీపమున నొకపొదలోనున్నది. మన

మిత్రము దానికడకుబోయి దానిని నీయింటికి భోజనమునకు పిలచినచో దానిచేత నాపామును చంపింపవచ్చును.

కొంగ — మహారాజువు నీవేలాగో పుణ్యము కట్టుకొనవలెను పోదవుము రా అనిపోయెను.

2 రంగము నీను కాకి, ముంగిస, కొంగ.

ముంగిస — ఓహో కాకిబావ కాబోలు చాలకాలమునకు వచ్చితివి యితడెవరు?

కాకి — ఇతడా నాస్నేహితుడు చాలమంచివాడు కావున ఇతనికిని నీకునుకూడ స్నేహము కలుపుటకు ఇచ్చటికి తీసుకొనివచ్చినాను.

ముంగి — నాకునుచాలాసంతోషమే.వచ్చికూర్చుండుడు. (వారు ముువ్వురు కొంతసేపు మాట్లాడిరి.)

కొంగ — (ముంగితో) నీకును నాకును ఈరోజుననే స్నేహమారంభము కావున నీవు మా యింటికి భోజనమునకు రావలెను నేను మరలవచ్చి నిన్ను పిలుచుకొని పోయెదను.

ముంగి — అయ్యో! ఇంతకన్న కావలసినదేమున్నది నేనటులనే వచ్చెదను. (అనగానే కాకియు కొంగయు ఎగిరిపోయెను).

(కొంగి యేటికిపోయి కొన్ని చేపలనుదెచ్చి వాటిలో గొన్నిటిని గూటిలో పెటి తక్కినవానిని ముక్కలుచేసి దాటిపాడుగునను పడవేయుచు కాకితోకలసి ముంగిస

యింటికివచ్చి దానినికూడ తీసుకొని చెట్టుకడకు పోవు
చుండెను.)

ముంగి—(దాత్రిలో చేపముక్కలనుజూచి తినుచు) ఈచేపము
క్కలు దాత్రిలోకెటులవచ్చెనో.

కొంగ—ఇదిమీరు ఫలహారం నిమిత్తం మధ్యమధ్యను నేను
పెట్టితిని ?

ముంగి—చాలసంతోషము, (అని వానినితినుచు కాకి కొంగ
లతోకూడ కొంగగూటిలోనికి పోయి భోజనముచేసెను
తరువాత నవిమూడును చెట్టుదిగివచ్చెను.)

కాకి—కొంగబావా! యిదిఏదో పుట్టలాగున్నదే.

కొంగ—అవును, ఇదిపుట్టయే దీనిలోనే పిల్లతాగ్రిచుపామున్నది.

ముంగి—ఆలాగా ? అట్లయిన మీరు చెట్టుమీదికిపొండు. నే
నిక్కడ నక్కియుండి పాము బైటకురాగానే దానిని
చంపివచ్చెదను. అనిపొంచియుండి (పాము బైటకురాగా
నే ముంగిస పామును చంపివేసెను. అదిమొదలు కాకి,
కొంగ, ముంగిస, స్నేహముగా నుండెను.

పాట. (మట్టు లాలి మాధవులలాలి అనుదానివలెపాడవలెను.

పల్లవి—పరులకును బాధచేయుగా ! వారలకు ప్రాణభంగిము క
లుగును ! బలహీనులగువారికి తోడ్పడుచు భగవంతుడె
ల్లప్పుడు॥

1. కొంగయొక చెట్టుమీద ! తనగుడ్లు కూనలతోబట
గాను ! పుట్టలోనున్నపాము ! ఆగుడ్లు భుజియించి
పోవుచుండె॥పరుల॥

2 మిత్రమగుకాకితోడా । యాకొంగ [illegible]ంచు
చూ । తనదుఃఖ మెరిగింపగా । ఆకాకి తగుసాధనం
బిటనే॥పరు॥

3. నానేస్తమగుముంగితో । స్నేహంబు నేసీకుకలిగించెదా
దాని సాహాయ్యమునసూ । పామునూ తప్పకాచంప
గలము॥

4. కాకి ఇటులనుబల్కగా । ఆకొంగకావించెనేస్తమటుల।
ఆముంగి ద్దానింటికీ । విందుకై అరగిపుట్టనుజూచెను॥పరు

5. పుట్టపక్కను సక్కచూ । ఆపాము పుట్టలోనుంచిరా
గా । రెంపుముక్కలుగాగను । దానిని చెండిపైచెను
వేగమె॥

6. కొంగకును బాధతీరె । ఆకాకి ముంగినేస్తములయ్యెను ।
ముంగి కొంగయు కాకియు । స్నేహముస మెరియుచుం
డిరి అడవిలో॥ పరు ॥

# ఏనుగు మొసలి కథ

ఒక అడవిలో కొన్ని ఏనుగులు గలవు అవి గుంపులు, గుంపులుగానుండును. ఒక ముగ ఏనుగును కొన్ని యాడఏనుగులును కలసి ఒకగు పుగానుండెను. వేసవికాలమగుటచే ఆయేనుగులు పగలంతయు గుహాలలోనుండి చీకటిపడినతరువాత చల్లగాలికొరకును హారముకొరకును ఏనుగులు గుహాలలోనుండి బైలుదేరి కొంతసేపు అడవిలో ఆటలాడి అలసి దాహముకాగా నీరుత్రాగుటకునుస్నానముచేయుటకు దగ్గర ఉన్నఒకపెద్ద చెఱువునకు పోయును. ఏనుగులకు నీటిలోని అటలన్న సంతోషమెక్కువగాన నాయేనుగులు చెఱువులోదిగి యీతలాడచుతొండ

మూఁతో నీరుపూరించి పైకి ఎగజల్లుచు ఒకదానిమీద ఒకటి పోసుకొనుచు తామరపువ్వులనుకూడ బెరకి తలలమీద పెట్టుకొనుచు చిత్తమువచ్చినట్లు ఆడుచుండెను. ఆగుంపులోనున్నవన్నియు ఆడ ఏనుగులే. మొగ ఏనుగు ఒక్కటిమాత్రమే యుండెను. ఏనుగులు మంచి ఆటసందడిలోనుండగా నీళ్ళలోపలనుండి వచ్చి ఒకమొసలి మొగఏనుగ కాలుపట్టుకొనెను. అదిచూచి భయపడి ఆడ ఏనుగులన్నియు గట్టెక్కెను. మగ ఏనుగు బలమైనది. మొసలికూడ బలమైనదేకావున ఆరెండింటికిని గొప్ప జగడమాయెను. ఏనుగును నీటిలోనికి లాగవలెనని మొసలి ప్రయత్నము. మొసలిని గట్టుమీదకు లాగవలెనని ఏనుగ పన్నాగము. కాని ఒకదాని నొకటి గెలువలేకపోయెను. తిండి తిప్పలు లేకుండ ఎన్నాళ్ళో పోరినవి. మొసలి నీళ్ళలోనుండుటచేత దానికి బలము తగ్గలేదుగాన ఏనుగుకు క్రమముగా బలము తగ్గిపోయినది. ఏనుగు చావునకు సిద్ధమైనది. ఆడ ఏనుగులు ఏడ్చుటతప్ప ఏమియును చేయలేకపోయెను. మగ ఏనుగుకు దిక్కెవరును కనబడలేదు. ఆశలన్నియు పోయినప్పుడు హరినామస్మరణము కలిగెను. ఏనుగ మనస్సు విష్ణుమూర్తిమీదకు పోయినది. మనస్సు ఇతరసంగతులమీదకు పోకుండా విష్ణుమూర్తిమీదనే ఉంచి ఏనుగు ప్రార్థించెను. నారాయణుడు దయగలవాడు. మొఱబెట్టిన వారిని కరుణించి రక్షించును. కావున అతడు ఏనుగు యేడ్పు వినబడగానే హరి ఎవ్వరితోను చెప్పకుండ అతివేగముగ అచటికివచ్చి తన చక్రమును బంపి నీటిలోనున్న మొసలినిచంపి ఏనుగును బ్రతికించెను గనుక భగవంతుని ప్రార్థించిన వారికి ఎట్టి ఆపదలైనను తొలగిపోవును.

# కప్ప—కొంగ—దేవేంద్రుడు

ఒక యడవిలో ఒకమడుగుకలదు. దానిలో చాలకప్పలున్నవి. అవన్నియు ఒకనాడు సభచేసెను. ఓకప్పలారా! ప్రపంచములో నన్నిజాతులవారికి రాజులుండి ఆరాజులు ఏలుచుందురు. రాజ్యములోనివారు సుఖపడుచుందురు. పాములకు శేషుడు రాజు, పక్షులకు గరుత్మంతుడు రాజు, మృగములకు సింహము రాజు గాని కప్పలమగు మనకు రాజులేదు. కాబట్టి మనది రాజులేని రాజ్యముగా యున్నది. అని యొక కప్ప అనెను. మనము అందరకు మేమిచేయుదమని ఒకబోదురుకప్ప యనెను. దేవేంద్రుని ప్రార్థించినచో మనకతడొక రాజునిచ్చునని ఒకముసలికప్ప చెప్పెను. దానికి కప్పలన్నియు ఒప్పుకొని ఇంద్రుని వేడుకొనెను. ఇంద్రుడు వాటికోరిక తెలుసుకొని యొక బండను మడుగులో పడవైచి ఇదే మీకు రాజు అని చెప్పెను. క కప్పలా బండ దగ్గరకుపోగా బండమాట్లాడ లేదు. మనరాజునకు నోరులేదు నోరులేని ఈలాంటి రాజు మనకెందుకని అవిమరల ఇంద్రుని ప్రార్థించెను. ఇంద్రుడు తిరిగివచ్చి వాటిమొరవిని అట్లయిన మీకింకొక రాజును పంపెదనని చెప్పి యొకకొంగను పంపెను. కొంగనుచూచి మంచిరాజు వచ్చెనని కప్పలు సంతోషించినవి. ఆకొంగ ప్రతిరోజునను ఒకటి రెండు కప్పలమీద ఏవోకొన్ని నేరములుమోపి మీకు యిదే శిక్ష యని వానిని తినసాగెను. కొన్నిరోజులగునరికి సగముపంతు కప్పలు చచ్చినవి అదిచూచి భయపడి కప్పలు తిరిగి సభచేసి ఈరాజు మనలను

బ్రతుకనియ్యఁడు మనకు రాజేవద్దని నిశ్చయించుకొని మఱల మొఱపెట్టగా మీకు బుద్ధివచ్చెనాదా! యని వానిమందలించి ఆకొంగను మరియొక దేశమున పడవైచెను. కప్పలు సుఖముగా బ్రతుకుచుండెను.

నీతి—అలవాటులేని పద్ధతులకు పోయిన అపాయము వచ్చును.

## 1 రంగము—కప్పలు.

పదునుకప్ప—అన్నలారా! లోకములో అన్నిజీవరాసులలోను రాజులుండి ఏలుచుందురు రాజుయేలుటచేత తక్కినవారికి సుఖముకలుగును మనకుమాత్రము రాజ లేదు ఈపద్ధతి బాగున్నదికాదు అని అనెను.

రెండవకప్ప—నిజమే, పక్షులకురాజు, గరుడుడు, పాములకురాజు శేషుడు, జంతువులకురాజు సింహము, కప్పలమగు మనకు రాజేడి?.

మూడవకప్ప—లేదు. సరేగాని మనమేమి చేయవలెను.

పదునెకప్ప—ఇంద్రుని ప్రార్థించవలెను. అతడు మనకు రాజు నిచ్చును.

కప్పలు—సరే, బాగున్నది (అని కప్పలన్నియు ఇంద్రుని ప్రార్థించెను).

ఇంద్రుడు—ఓకప్పలారా! మీకేమికావలయును.

కప్పలు—స్వామీ! మాకొక రాజుకావలెను.

ఇంద్రుడు—సరే, పంపెదను. అని పోయెను (అంతలో ఒక దుంగ మడుగులోపడెను.)

ఒకకప్ప—అరుగో! రాజుగారు వచ్చినారు.
కప్పలు—మహారాజా! నమస్కారమండి.
దుంగ—మాటాడలేదు.
కప్పలు—రాజుగారూ! మాట్లాడరేమి. మొదట ఒకకప్పదుంగ మీాదికి ఎక్కెను తరువాత పదికప్పలు ఎక్కినను దుంగ కదలలేదు మాట్లాడలేదు.
కప్ప—మనరాజు కదలడు మెదలడు మాటాడడు వీనికి నోరు లేదు ప్రాణములేదు.
మరొకకప్ప—మనకీరాజు ఎందుకు? మంచిరాజు నిమ్మని తిరి గి ఇంద్రుని వేడుదము (అని ఇంద్రుని ప్రార్థించెను)
ఇంద్రుడు—(తనలో) వీనికి మంచిరాజు కావలెనట వీనికి బుద్ధి వచ్చులాగున చేసెదను) సరే, మరియొకరాజును బంపె దను (అనిపోయెను కొంగ నొకదానిని పంపెను).
కొంగ—(తనలో) నాపనిబాగున్నది ఏదో ఒక వంకబెట్టి రో జుకు రెండుమూడు కప్పలను చంపి తినుచుండెదను (అని అటులచేయసాగెను) ఒకనాడుకొంగ ఎక్కడకో పోయెను).
కప్పలు—ఈరాజు వచ్చిన తరువాత మనలో నాల్గవవంతు కప్ప లు కడతేరినవి ఇంకను కొన్నిరోజులు వున్న మనలసం దరినికూడ నాశనము చేయగలదు మనకేమిగతి.?
కప్ప—మనకీరాజు పనికి రాడని మరల వేడుటచే మన మీాద కోపమువచ్చి దేవేంద్రుడు మనకీరాజు నిచ్చినాడు మర ల అతనిని ప్రార్థింపవలెను.

కప్పలు—సరే? కానిండు! (అని ప్రార్థించును).
ఇంద్రుడు—మరల మీకేమికావలెను.
కప్ప—మమ్ము రాజు దిగమింగుచున్నాడు మాకు ఏరాజును వద్దు మాదారి మమ్ము బ్రతుకనిచ్చిన అంతేచాలును గాన వీరిని తప్పించివేయుము.
ఇంద్రుడు—ఇప్పటికైన మీకు బుద్ధివచ్చినదికదా! సంతోషమే మీరాజును తీసుకొని పోయెదనులెండు (అనిపోయెను) కొంగ మరల రాలేదు కప్పలు సుఖపడినవి.

## పాట—ఇంగ్లీషునోటు—ఏకతాళము

(ఆ క. కొందము మరిపాడుకొందము. అనుదానివలె).

పల్లవి—కొత్త పద్ధతుల్ కోరుదానిలో
ముందు వెనుక లరయకున్న మోసమయ్యెడున్ ॥కొ॥

1. అడవిలోపల ఒకమడుగుయందున
కలసిమెలసియుండె కొన్నికప్పలచ్చట ।కొ॥
2. రాజులేనిదే రాజ్యమేమిటి
ఇంద్రువేడ రాజునిచ్చు నింకమనకును కొ॥
3. అనుచుకప్పలు అతనివేడగా
బండనొకటిరాజటంచు పంపెనాతడు ।కొ॥
4. బండపలుకదూ పలుకరించినా
నోరులేసిరాజటంచు దూరెకప్పలు ।కొ॥
5. మరల ఇంద్రుని వరమువేడగా
కోపమునను పంపెనొక్క కొంగరాజును ।కొ॥

6. కొంగ కప్పలా మ్రింగసాగెను
   కప్పలెన్నోచావ చాలకలతబుట్టెను ।కొ॥
7. కప్పలింద్రుతో చెప్పుకొనగను
   పారదోలె రాజునపుడు బ్రతికె కప్పలు ।కొ॥

## సింహాము—గుఱ్ఱము—కథ.

ఆకలిచే మలమలమాడుచున్న ఒకసింహ్వాము ఆహారము కొరకు అడవిలో తిరుగుచుండెను. అంతలో నొకగుఱ్ఱము దానిని దూరమునుండిచూచి కుంటుచు నడువసాగెను. సింహ్వాము దానినిచూచి నాకిది ఈపూటకు తిండికిసరిపోవును, ఇదియేమో కుంటుచున్నది. మందువేసెదనని చెప్పి మాయచేసి చంపి తినెదనని తలపోసి దగ్గరకు పోయెను. గుఱ్ఱము కదలలేని దానివలె నిలువబడెను. గుఱ్ఱమా ! నీవేమి కుంటుచున్నావు నేను వైద్యుడను మందువేయుదును చెప్పుమని సింహామడిగెను. మరేమియులేదు నాకాలులో తుమ్మముల్లు గ్రుచ్చుకొని అదిచీముపట్టియున్నది. నడువలేకున్నాను అనిగుఱ్ఱమనెను. అదెంత పని నిముషములో మాన్పెదను కాలుచూడనిమ్మని సింహాము దగ్గరకు పోయెను. గుఱ్ఱము కాలుచాపి సింహామునకు చూపుచు దగ్గరకు రానిచ్చి ఫెడేలుమని ఒక్కతన్ను తన్నెను. ఆ తాపుతో సింహాము నేలగూలెను. గుఱ్ఱమొక్క పరుగామున పరుగెత్తిపోయెను. మోసము చేయఁగోరువానికే దోషము తగులును.



## సంభావణ సింహాము? గుఱ్ఱము.

సింహాము—(తనలో)నాకాకలి యగుచుండెనుతినుటకుఒక జంతువైనను కనబడలేదు గాన నీయడవిలో తిరుగుదును (అనితిరుగు చున్నది).

గుఱ్ఱము—ఓహో, కొంపమునిగినది ఈసింహమొకటి దాపరించినది నన్ను చూచినా చంపకమానదు. దాగుటకు దారిలేదుగాన రోగిష్ఠిదానివలె కుంటుచూ నడచెదను. తరువాత దైవమున్నాడు (అనికుంటుచూ నడుచుచుండెను).

సింహాము—అహా! యిప్పటికి తిరుగగా, తిరుగగా, ఒకగుఱ్ఱము కనబడుచున్నది. దీనిని తినవచ్చునుగానియిదిరోగిష్ఠిదానివలెనున్నది. రోగిష్ఠిదానిని తినిన నాకుకూడ రోగము వచ్చునేమో ఏమైననుసరే. ఆకలిబాధ భరింపలేకున్నాను (అని దానిదగ్గరకుపోయి) ఓహో! గుఱ్ఱము భావగారా? సరి.సరి. ఆనవాలు పట్టలేకుండనున్నాను. తమకేమో జబ్బుగానున్నట్లున్నది. నేను వైద్యుడను. కావలసినమందు యివ్వగలను నీకేమిరోగమో నాతో చెప్పుము.

గుఱ్ఱము—సింహాముభావగారు! రోగము మాటకేమిగాని ముందు నాకీముల్లు బాధ ఎక్కువగానున్నది. వెనుకటి ఎడమ కాలిలో తుమ్మముల్లు విరిగినది. అదిచీముపట్టి నడువనియకున్నది. మీరాబాధ మాన్పగలరా?

సింహము—ఇదియెంతకార్యము నిముషములో పోగొట్టగలను. కాలు చూడనిమ్ము (అని వెనుకకుపోయి కాలు చూడ సాగెను).

గుఱ్ఱము—ఇదిగో చూడుమని కాలు చూపించుదానివలె పైకెత్తి సింహము దవడమీద గట్టిగా నొక్కతన్ను తన్నెను. అందువల్ల సింహము నేలకూలెను. గుఱ్ఱము దాడున పరుగెత్తిపోవుచు నన్ను చంపదలచిన నీకే చెంప పెట్టు మహాబాగా తగిలినది గదా! పరులను మోసపుచ్చు కోరికగలవారందరికి నిదియే గతిగలుగును. (అని తనలో ననుకొనెను).

## గుఱ్ఱము—సింహము తోహారమట్టు.

అడవిలోనుంటుచు పరిగెడుగుఱ్ఱము నటగనెనొక సింహంబు
కడునాకలిచే బడలుచు నాకడగలవుమందులని పలికెతనుఁ
కడువడి గుఱ్ఱమునటన్ ।అడవి।

సింహము మోసముచేసెదుననుచునుచిత్తములోపల దలపోసి
ముల్లుగుచ్చుకొనె కాలిలోనని మోసముతోడుత నశ్వం
బుఁ బాధపడునటులగుపడుచుకా ।అడవి।

కాలుజూతునని కడకుజేరగాగ్రక్కున గుఱ్ఱముతన్నెను
నాకాలితాపుతో సింహము నేలనువ్రాలి కొట్టుకొనునంతటి
లో గ్రక్కునపరువిడె నశ్వంబున్ ।అడవి।

మాటతీపియు మనసువిషమును గలిగినద్రోహులకిటువలెనే
చేటువెంటనే మూడకమానదు చేయకుడెన్నడు మోసము
నుఁ చేసిన చాలగగాసియగున్ ।అడవి।



# కొంగ—నక్క.

ఒక అడవిలో ఒకనక్కయు ఒకకొంగయును కలవు. తనకెక్కువ తెలివితేటలుగలవని నక్కగర్వపడుచు తక్కిన జంతువులను వేళాకోళము చేయుచుండును. ఒకనాడా నక్క కొంగను వేళాకోళము చేయదలచి తనయింటికి భోజనమునకు రమ్మనమని పిలచెను. కొంగవచ్చెను. నక్క పరమాన్నము వండి లోతులేని పళ్ళెములోపోసి కొంగముందుపెట్టి తినుమని తానింకొక పళ్ళెములో పోసుకొని తినుచుండెను కొంగ పొడుగుపాటి ముక్కుగలదగుటచేత తినలేకపోయెను. నక్క ఏమి నీవేమియు తినవనగా నాకాకలిలేదు. కావున కొంచెముకొంచెముగా తినుచున్నానెను. నక్క లోలోపల నవ్వుకొనుచుండెను. కొంగ నక్కచేసిన వంచన గ్రహించి పగదీర్చుకొననెంచి ఆలోచించుచుపోయెను. మరికొన్నిరోజులకు కొంగ నక్కను భోజనమునకు పిలచెను. కొంగతెచ్చిన మంచిమంచి చేపలను తినవచ్చునని నక్క పొంగుచు పోయెను కొంగ రకరకముల చేపలనుతెచ్చి పొడుగుగాను సన్నముగాను ఉండు మూతులుగల కూజాలలో వేసి ఒకకూజాను నక్కముందుపెట్టి తినుమని తానింకొక కూజాను ముందుపెట్టుకొని అందులోనున్న చేపలను తనముక్కుతో పైకితీసి తినుచుండెను. నక్కమూతికూజాలోపటనే లేదు. కొంగ తినుచుండగా నక్కకు నోరూరుచున్నది. అదితినలేక ఇటునటు చూచుచుండెను. ఏమినక్కబావా? మంచిమంచి చేపలు ఎన్నో కూజాలోనున్నవి ఒక్కదానినైన తినవేమని కొంగయనెను. ఏమోనాకీచేపలవాసననసరిపడ లేదుఇంతేగాక నేను పొ

ద్దినసే మాంసముతిని వచ్చితిని అనిచెప్పి తాను చేసినదానికి కొంగ తగినట్లు చేసినదని తెలుసుకొని సిగ్గుపడి నక్క వెడలి పోయెను. గనుక ఒకరిని వంచన చేయవలెనన్న తనకే వంచన కలుగును.

పనంగము—1 వ రంగము.

నక్క—ఈకొంగ చాలపొంగుచున్నది. దీనికి పరాభవము చేసెదను. కొంగబావా! నేను యీరోజున చిత్రమైన పరమాన్నము చేసితిని నీవు మాయింటికివచ్చి కొంచము రుచిచూచిపొమ్ము

కొంగ—అయ్యో! అభ్యంతరమేమి అలాగేవచ్చెదను పద. (అనిపోయెను).

నక్క—అదిగో! అలోతులేని పళ్ళెములోపోసిన పరమాన్నమును త్రాగుము నేనీపళ్ళెములోని పాయసమును త్రాగెదను (అని త్రాగుచుండెను).

కొంగ—(తనలో) నన్నిది మోసము చేసినది నేను త్రాగలేనని ఈలోతులేని పళ్ళెములో పోసినది.

నక్క—కొంగబావా! నేనంతయును తినివేసితిని. నీవుకొంచమైనను తినలేదేమి?

కొంగ—మరేమియు లేదు. నాకాకలిలేదు. కొంచెము కొంచెముగా రుచిచూచితిని ఇకచాలును పోయెదను.



## 2 వ రంగము.

**కొంగ**—(తనలో) నక్క నన్ను చేసిన మోసమునకు తిరిగి మో
సము చేయవలెను. అదిగో వచ్చుచున్నది. నక్కబావా!
నీవు నాకు పాయసము విందుచేసితివి. నేను నీకు మంచి
చేపల విందుచేసెదను మాయింటికి రమ్ము.
**నక్క**—(తనలో) నాకు మాంసమేగాని చేపలెప్పుడును దొరకవు నే
నుకడుపునిండ తినెదను. (కొంగతో) ఆ! ఆలాగే వచ్చెదను.
**కొంగ**—అదిగో సన్నపుమూతిగల కూజాలో నీవు తినుము ఈ
కూజాలోఉన్నదానిని నేను తినెదను. (అని తినసాగెను).
**నక్క**—కొంగ నాకన్న రెండాకులు యెక్కువ చదివినది అప్పు
డది రుచియైన చూచెనుగాని నాకిప్పుడామాత్రమయిన
ను ప్రాప్తములేదు. ఇప్పుడు నాకాచేపలుఅందుట లేదు.
**కొంగ**—అయ్యో! తినవేమి? బావా! మొగమాటమా? నె
మ్మదిగా కూర్చుని ఒక్కటైనా తిను.
**నక్క**—అబ్బే చేపలంటే ఏమిటో అనుకున్నాను నాకావాసనే
పడదు. అంతేకాక నేను పొద్దుననే మాంసముతిని
వచ్చినాను నాకాకలి లేదనిపోయెను.
**కొంగ**—(తనలో) నేనే తెలివైనదానినని పొంగుచుండు నక్కకు
చక్కని పరాభవము జరిపితిని.

నక్కఇకనైనను యితరులనుఎగతాళి చేయననుకొనెను,

**పాట॥** అటవీస్థలముల కరుగుచుచూ (అనుదానివలె పాడవలెను)
పల్లవి—తెలివి చాలగ గలదను చు తలచుచు హేళన సలుప
కుమీ॥

**నక్క**—నేడొకచిత్రము నేజేతు కొంగకు భంగముకాగా
**కొంగ**—నక్కబావా నీవెక్కడికి పోవుచునుంటివి పొద్దుననే

నక్క—నిన్ను భోజనమునకును నే బిలువ వచ్చితి రావలెనచ్చటికి

కొంగ—అందులకేటికి సందియము నడువుము యింటికి కడువడిగన్

నక్క—పళ్ళెరమున నదె పాయసము లోతు లేదు తినుకడుప్రీతిగను

కొంగ—ముక్కునకందదు కెక్కరణి తినగల పాయసమును నేను

నక్క—పాయసమొత్తో బాగుగనూ చేసితి తినవది చెల్లునొక్కొ

కొంగ—ఆకలి లేమిని అటువలెనె తినుచుంటిని కొద్దిగను

నక్క—ముక్కు కందదని మొరలిడగా గొప్పకు బొంకెదు కొక్కెరయు

కొంగ—చాలగసంతోషము నీకు చేపల విందును చేసెదను

నక్క—నీవు పిలచితిగావుననూ వచ్చెదతప్పక అచ్చటికి

కొంగ—లోతగుకూజాలోగలవూ ఆచేపల తినుమధికముగా

నక్క—కొంగచాలభంగము చేసె మోసమునకుబదుల్మోసమును

కొంగ—మంచిచేపలవి కొంచముగాఅయినను తినవేమందునికన్

నక్క—ఈవాసన నాకించుకయుయిష్టము లేదిక ఎటుతిందున్

## పెద్దపులి—బ్రాహ్మణుడు—నక్క కథ.

ఒకవేటకాడు అడవిలో పెద్దపులిని పట్టుకొని తెచ్చి తనతోటలో నొకబోనులో పెట్టి గడియవేసెను. ఒకనాడొక బ్రాహ్మణుడుఆతోటకుబోయిబోనులోనున్న పెద్దపులినిచూచుచుండెను. అప్పుడు "ఓబ్రాహ్మణుడా నాకు దాహమగుచున్నది. నీవొక్కసారి తలుపుతీసినగాని నాప్రాణములు నిలువవు" అని

పెద్దపులి అనేకవిధముల బ్రతిమాలుకొనెను. ఆబ్రాహ్మణుడు 'ఓ పెద్దపులీ నేను తలుపుతీసెదనుగాని తీయగానే నీవు నాపై బడెదవేమో' అని బ్రాహ్మణు డనెను. సరి. సరి. 'ఎంతమాట! తమరు నాప్రాణము కాపాడుచుండగా నేను మీప్రాణము తీయుదునా' అని పెద్దపులి యనెను. బ్రాహ్మణుడునమ్మి తలుపు తీసెను. పెద్దపులి వెంటనే వానిమీద పడబోయెను. బ్రాహ్మణుడు కుయ్యో 'మొఱ్ఱో' యని యఱచుచు దూరముగ బోయి నీమాట నిలుపుకొనవా, నన్ను చంపెదవా అని యనెను. నా మాటయా? నిన్ను తినుటయే! మాఱుమాటాడకుము అని పెద్దపులి మీదిమీదికివచ్చుచుండెను. కొంచెము తాళు-తాళు-మన మైదుగురు తగువరులను నడుగుదము. వారు చెప్పినట్లు మనము వినవలెనని బ్రాహ్మణుడనెను. సరే-నడువుమని పెద్దపులి బ్రాహ్మణుని వెంట బయలుదేరెను. మొదట నొక మఱ్ఱిచెట్టు కనబడెను. ఓ మఱ్ఱిచెట్టా నేనీపెద్దపులిని బోనునుండి విడిపించితిని. నన్నిది చంపవచ్చుచున్నది తగవుతీర్చుమని బ్రాహ్మణు డడిగెను. ఎండకాయునప్పుడు వాన కురియునప్పుడు నానీడను తలదాచుకొను నరులకు దయలేక నాకొమ్మలను నఱుకుచుందురు. మీరు విశ్వాసము లేనివారు గావున మనుష్యులను చంపవచ్చునని మఱ్ఱిచెట్టనెను. పెద్దపులి మఱల బ్రాహ్మణునిమీద పడబోయెను. అయ్యో! నన్ను జంపకుము యింకను నలుగురు మధ్యవర్తు లున్నారని బ్రాహ్మణుడు నడుచుచుండెను. కొంత దూరమున నొకయెద్దు కనపడినది. యెద్దుబావా! దీనిని నేను రక్షించితిని, నన్ను భక్షింపనున్నది తగువు చెప్పుమని బ్రాహ్మణు డడిగెను. బలముకలిగి రాత్రియు పగలును పాటుపడునప్పుడైన నన్ను తిన్నగ జూచెడివారుకారు. ముసలివానినై తినని

నన్నిప్పుడస లేవిడిచి పెట్టినారు. మనుష్యులకు దయలేదు కావున నిన్ను పెద్దపులి చంపవచ్చును అని ఎద్దు చెప్పెను. సరి సరి బాగుగనే చెప్పితివనెను. అంతలో పెద్దపులి మాఅలమురింగరాగా తొందఅపడకుము ఇంకను ముగ్గురు పెద్దలున్నారు అని బ్రాహ్మణుడు దారితీసెను వారికచట రామబంధుపక్షి కనుపించెను. అయ్యా! నేనీ పెద్దపులిని కాపాడితిని. నన్నిది చంపవచ్చు చున్నది. న్యాయము చెప్పుము అని బ్రాహ్మణుడడిగెను. నేనడవులలో నుండును నరుల దగ్గరకైనను పోను. నారు మాజాతిపక్షులగూళ్లలోనుండు గుడ్లను దొంగిలింతురు కావున మిమ్ము చంపవచ్చునని రామబంధుపక్షి యనెను. [illegible] నడబోవు పులిని మరల బ్రతిమాలి ఆప సాగిపోవుచుండగా కొంతదూరమున నొక నదియొడ్డున పడియున్న మొసలి వారికగుపడెను. మొసలితో వెనుకటివలె చెప్పగా నేను నీళ్లలో యుండును. నన్ను మీజాతివారు తుపాకితో కాల్చి చంపుదురు. గాన నిన్ను చంపవచ్చును అని మొసలి చెప్పెను. పులి యీసారి తప్పకచంపెదననెను. ఇంక ఒకనిమాత్రి మడిగెదను. అంతవరకు ఆగుమని బ్రాహ్మణుడు బ్రతిమాలెను. నాలుగడుగులు సాగగా ఒకచోట నొక నక్క కనుపడెను. దానితో ఆబ్రాహ్మణుడు ఆవృత్తాంతము నంతయు చెప్పెను. నేను న్యాయముగా చూచి నగాని గ్రహించలేనని నక్క బ్రాహ్మణుని, పులిని బోనుకడకు తీసుకొనివచ్చెను. నీవెట్లుంటివో, నిన్నితడెట్లు విడిపించెనో చూడవలెను అని నక్క అనగా పెద్దపులి బోనులోనికి పోయెను. తలుపు యిదిమూ యని నక్కయడుగగా ఇదిమో యిట్లు మూసియున్నది అని బ్రాహ్మణుడు తలుపుమూసెను. గడియ యెక్కడనని నక్కయడుగగా ఇదిగో యిట్లువేసియున్నది అని

యతడు గడియవేసెను. బ్రాహ్మణుడా! దుష్టులకు ఉపకారము చేసిన అపకారము సంభవించును గాన నీదారిని నీవు పొమ్ము అని నక్క చెప్పగా బ్రాహ్మణుడు మిక్కిలి సంతోషముతో బ్రతికితినిదైవమా యనివెళ్లెను.

1 వ రంగము. పెద్దపులి—బ్రాహ్మణుడు ప్రసంగము.

పెద్దపులి—అయ్యా! నాకు చాలా దాహమగుచున్నది. ప్రాణములు నిలుచునట్లులేదు. ఈబోను తలుపొక్కసారి తీయుము.

బ్రాహ్మణుడు—తలుపుతీసెదనుగాని నీవువచ్చి నాగొంతుకు కొరికివేయుదువేమోయని భయపడుచున్నాను.

పులి—సరి-సరి- ఎంతమాట అంతవిశ్వాసఘాతుకముండునా? నేనట్టిపనిచేయను. తలుపుతీయుము అనెను.

(బ్రాహ్మణుడు పులిమాటలునమ్మి తలుపుతీసెను. పులి అతని మీదపడబోయెను.)

బ్రాహ్మణుడు—అయ్యో! నన్నుచంపెదవా? ఇదినీకున్యాయమా? నీవన్నమాట తప్పుచున్నావేమి?

పులి— ఆ! న్యాయమే పులికి మనుష్యుని చంపితినుట న్యాయమేకాదా? (అని మీదపడబోయెను.)

బ్రాహ్మ—మీదపడకు ఆగు- ఆగు- నీమాటయునుకాదు, నా మాటయునుకాదు. తగుమనుష్యులు అయిదుగురుచెప్పి నట్లు నడుచుకొందము నావెంటరమ్ము (అని యిద్దరును పోవుదురు.)

2వ రంగము. మఱ్ఱిచెట్టు, బ్రాహ్మణుడు, పులి.

బ్రాహ్మ—ఓమఱ్ఱిచెట్టా! నేనీపులిమాటనమ్మి దీనినిబోనునుండి

తీసితిని నన్నిది చంపబోవుచున్నది తగువు చెప్పుము.

మఱ్ఱి—తగువు చెప్పవలెనా! ఎండ కాయునప్పుడు వానకురియు నప్పుడు నా నీడకే చేరుచు విశ్వాసము లేక నా కొమ్మలనే నఱికివేయు నరులకు న్యాయమెక్కడ నిన్ను చంప వలసినదే.

పులి—ఇదిగో నిన్ను చంపెదను.

బ్రాహ్మ—అయ్యో! చంపకుము మఱినలుగుఱినిఅడుగవలెను.

3వ రంగము. ఎద్దు, బ్రాహ్మణుడు పులి.

బ్రాహ్మ—ఓ ఎద్దుబావా! నేనీపులిని బోనునుండి విడిపించితిని నన్నిపుడిది చంపబోవుచున్నది. ఇది ధర్మమగునా?

ఎద్దు—ధర్మమడుగుచున్నావా? అన్ని కాలములయందును విసుగులేక రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేయునప్పుడే కడుపునిండ తిండిపెట్టువారు కారు ముసలిదానినని నన్నిప్పుడు అవతలే త్రోసివేసినారు. మనుష్యులకు ధర్మమెక్కడ! గాన నిన్ను చంపుటయే ధర్మము.

పులి—ఇంక నీపనిసరి.

బ్రాహ్మ—మొఱ్ఱో! ఇంకా ముగ్గురుమధ్యవర్తులున్నారుకాదా? (అని యిద్దరును పోవుదురు.)

4వ రంగము. రామబంధు, బ్రాహ్మణుడు, పులి.

బ్రాహ్మ—ఓపక్షిరాజా! నేనీపులికి సహాయము చేసితిని. నన్నిప్పుడది చంపబోవుచున్నది. నీతి చెప్పుము.

రామ—గ్రామములో నివసించక అడవిలో తిరుగు నేను పెట్టిన గ్రుడ్లు నరులు దొంగతనముగా తీసుకొనిపోయెదరు.

వారికి నీతియెక్కడ నున్నది. మీయెడల దయచూప రాదు. నిన్ను చంపవలసినదే.

పులి—ముగ్గురైనారు ఇక నిన్ను ముక్కలుచేసెదను.

బ్రాహ్మ—ఇంకనిద్దరున్నారుకాదా! తరువాత చంపుదువుగాని లే. (అని పోయిరి.)

5వ రంగము. మొసలి బ్రాహ్మణుడు, పులి.

బ్రాహ్మ—ఓ మొసలీ! దాహమని ఏడ్చిన ఈపులిని బైటకు తీసితిని నన్నది మింగబోవుచున్నది. తగవు చెప్పుము.

మొసలి—నేనెల్లప్పుడు నీళ్ళలో నుందును. నరులకంటబడను. నన్ను వలలువేసి తుపాకులతో గాల్చెదరు. గాన నిన్ను చంపదగును.

పులి—ఇకచాలులే నిన్నుమింగెదను.

బ్రాహ్మ—ఇంకొక్కడే. ఇంకొక్కడే. కొంచెమాగుము (అని పోయిరి)

6వ రంగము. నక్క, బ్రాహ్మణుడు, పులి.

బ్రాహ్మ—నక్కబావా! పులినోటబడుచున్నాను. నన్ను రక్షించవలెను.

నక్క—నీవేమిచేసినావు?

బ్రాహ్మ—పులి దాహమని ఏడ్వగా బోనుతలుపుతీసినాను.

నక్క—బోను ఎక్కడనున్నది.

పులి—తోటలోనున్నది.

నక్క—నాకు బోధపడలేదు. కన్నులార చూచినగాని గ్రహించు తెలివినాకు లేదు.

